

అహింసాపరమోధర్మః.

# జంటనారాయణశతకము



శ్రీగంగధారులుపుట్టినా శ్రీకరతుపాదములంచు
యోగంబులేభజనంబులై యొసగింపదేవగవారికి
వేగంబునాహృదయంబులో వివరింపదాసునిచేయుము
నాగంబరాధరసన్నుతా నారాయణా నారాయణా। ౧

భువినేనుమీపాదాబ్జముల్ పొగడంగలేనయు
కృష్ణమాధవమమ్ము నీకృపచూచుమీ దశజన్మధారణ కారణా।
రవితేజమంగళమూర్తి వోరఘువీరనారదవందితా
నవమోహనా భవభంజనా నారా॥ నారా॥ ౨

పలుమారునీశుభనామముల్ పఠనంబుజేయగ నేరనే
కులహీనుని బహుపాపసంకలితుండనైతినినీవు నా।
వలనేరమెన్నగనేమయా వసుదేవనందనకృష్ణయో
ననుగన్నవా నను బ్రోవవే నారా॥ నారా॥ ౩

పరులందునేనపకారినై బహుపాపసంకలితుండనై
ఇరవొందదేవరపాదముల్ హృదయంబునిల్పగజాలనే।
నరులందుద్రోహుండను గానివాడని న్నకన్నడచేయకే।
నరసన్నుతా నను బ్రోవవే నారా॥ నారా। ౪

సురులందుకొన్నమృతంబులో సులభంబులిచ్చినగానీ నా
యురవొందరోగము లెల్లదా ఇదముంచుభంగినియేను నే।
నిరతంబునీభజనంబులై నిజభక్తిని యుక్తిని నిన్నుదా
నరసన్నుతా నను బ్రోవవే నారా॥ నారా॥ ౫

జగమెల్లనీయుదరంబులో జనియింపజేసినవాడవై
యగడొందుబుద్ధినికొందరై యనుగణ్యబుద్ధినికొందరు।
తగవెంచనీవెనుపక్షపాదము దక్షివాడనుకొందరై
నగధారణ యిదియేమయా నారా॥ నారా॥ ౬

కాయంబునిల్కడనైననిన్ కడువేడుకొందురుమిక్కిలిన్
తోయంబుతో లినబూచలై దొరకొన్నసంసారాంధులై।
మాయంబుచేసినమిమ్ముదా మదిగెంచువారికి నేడుదా
న్యాయంబులెల్లనొకదా నారా॥ నారా॥ ౭

నెలకొన్నపూవులెల్లజారగా నెలవొంక నెన్నుదురంగుగా
పరికింపనెంతయుజలగ్నలై పలుమారు పైచరింపగా।
సురతంబులిమ్మనవారిలో సుఖలీలనుండితివీవయా
నరకంబులో నను ద్రోయకే నారా॥ నారా॥ ౮

జననంబులొంటయుజేసియున్ జనరక్షకర్తవు నీవుదా
ధనమందుకొందగురక్షలై తిగనిన్ను పూజలుచేసియున్।
ననుపొంద నెమ్మదినుండినన్ అతిభక్తిమ్రొక్కుచునిప్పుడున్
ననువంటిదీనుని బ్రోవవే నారా॥ నారా॥ ౯

హరిపుత్రులెవ్వాసినవ్రాతకున్ నధికంబులేదనియుందురే
పరికింపకాసినకాదిగా బహుసంయమీశ్వరులందరుం।
తనయందునీకృప గ్గియుం తపమందు నెప్పుడునందురే
నరసన్నుతా నను బ్రోవవె నారా॥ నారా॥ ౧౦

గాయత్రిసంధ్యలుహోమముల్ గంగాదియాదిగనుండనా
తోయంబులాడగమిక్కిలిన్ దోసంబెపోవునేయచుయా।
నీయాత్మచింతలుహోమముల్ నిజతీర్థయాత్రలుసత్రముల్।
న్యాయప్రకారముచేయవా నారా॥ నారా॥ ౧౧

పదమందుపద్యములందునీ భజనంబుచేయగనేరనే
యుడయొందుకేలినవిన్నవా హృదయంబునిల్పగలేను నా
మదమందుపామరుడైననా మదినుండినను బ్రోవుమీ।
నదిఖంగుధారణసన్నుతా నారా॥ నారా॥ ౧౨

తరకోపధారిణిలేదునీ సన్నిధానమెన్నడుచూడనే
కడునీదుభక్తులలోన నొక్కరిలోనుభాషితుగా నన్ను ।
రొండమీదురాతయబ్రోవుమీ ఇతరంబులేదిదిసత్యమే
నడయాడనిగ్రహమోనమో నారా॥ నారా॥

ఫలమూలదేహిని నేనుదా బహుదుర్గుణాధిపు నేనుదా
ఇవియెల్లదేవరయిచ్చినీ హృదయానకోపము లెంచితగా ।
నవగూడుగర్భమునందు మూగనుగొన్న యెవ్వరు నెంతురో ।
నవమోహనా దయజూడవే నారా॥ నారా॥

నెలకొన్న కాముకమూఢులై నినుయెంచలేదని నన్ను దా
చులకంగచూడకుమయ్యవో సురరాజవందితపాద నే ।
పలుకంగవింటివిలేకనీ బహుభక్తసందడినుంటివో ।
లనుగన్నవా నను బ్రోవవే నారా॥ నారా॥

మనసీతచేసినచింతలై మదిగోరినుండియుమిక్కిలిగా
జనదూషకత్వముగాగనే చరియించునేరములన్నియుగా ।
ఇనమంచుభంగినిచేసినా హృదయంబునందుననుండియుగా
ననువంటి ధీమని బ్రోవవే నారా॥ నారా॥

మొలనూలుఘంటలుమిక్కిలిగా మురిపెంపునవ్వులచందముల్ *
ఘలుఘల్లుఘల్లనవందియల్ వడిమ్రోయనాడినపాదముల్ ।
ఇలనిన్ను చూడగ వేడుకై ఇదెనిన్ను వేడితి నేసయా ।
ననుగన్నతండ్రివిరావయా నారా॥ నారా॥

ఇలజీవనంబులనేనదా యెన్నెన్ని సత్యముచేసితగా
గల్లవారిసొమ్ములకందునే కడుద్రోహిచింతలుచేసితగా ।
పలుమారు సేభజనంబుగా పరిహారమౌనను యెంచితగా
ననుగన్నవా నను బ్రోవవే నారా॥ నారా॥

అనవొందనాసురబంతిని యమృతంబులియ్యగచూచినగా
పెనురక్కసాధముడప్పుడా ప్రియమందియుండినవేళగా ।
ఘనచక్రధారలగొట్టియుగా ఘనుడైనదేవరయిప్పుడుగా
ననుచెందుపావముదూరవే నారా॥ నారా॥

తెలియంగనీభజనంబుకే తెలియంగజెప్పినవారికిఁ
కలదన్న వేళలయందు నే కడనుండియవ్వలనుండగా।
తొలిబుద్ధిచేకనచిత్తుడై దొరకర్మడిప్పుడు నేనయా
ననుగన్నవా నన్నుబ్రోవవే నారా॥ నారా॥ ౨౦

అగడొందుసుజ్ఞానత్వముఁ దతిదూరమెక్కగలేను నే।
మగడంగసుజ్ఞానంబుదా మరియందలంబుననీవునఁ।
పొగడంగనీబటుడౌదునా పురుషోత్తమోత్తమకేశవా
నగధారణాదయచేయవే నారా॥ నారా॥ ౨౧

అలపాండుపుత్త్రులదేవనిఁ నభయంబు వేడినయప్పుడుఁ
తిలకించిమానము కావవా దృఢచిత్తవైభవమియ్యవా।
ఇల నేనుకోరినకోరికల్ ఇదినాకయిమ్చుట పెద్దయే
ననుగన్న శ్రీహరిరోహరి నారా॥ నారా॥ ౨౨

చలమొప్పనుబ్బసవ్యాధికిఁ సహియింపజాలను నేను నా
వలనిప్పుడేమియు నేరమో వసుదేవనందన చెప్పవే।
ఇలతప్పుకార్యముచేసిన హృదయంబు వేడితినిప్పుడుఁ
నా పెన్నిదానన్నుబ్రోవవే నారా॥ నారా॥ ౨౩

పాపంబుతాటంగొనెట్టినో పరియంగిరంబులునెట్టినో
కోపంబుచూపకమేననే కుటిలాత్మదేహిని నేనయా।
ఆపన్నిరక్షితుడైనని నభయంబు వేడితినిప్పుడుఁ
నా పెన్నిదానన్నుబ్రోవవే నారా॥ నారా॥ ౨౪

తొలికర్మబంధము లెల్లదా తొలగంగచేసియునిప్పుడుఁ
ఇలజన్మమాటయుచేసియుఁ నిలయొక్క నేరము లెంచదో।
పలుకంగ నేమియుచేయునా బవపుణ్యకర్తవునీవుదా
ననుగన్న శ్రీహరిరోహరి నారా॥ నారా॥ ౨౫

మది నెంచుకార్యముగ్రక్కనా మరియున్న వేళలాయందునా
కొదవైనవేళలయందునీ గుణమెంచియుత్తరుగానవా।
హృదయంబునెట్టిదొయైననీ హితమెంచినన్నుబ్రోవవే నది
యందుధారులసన్నుతా నారా॥ నారా॥ ౨౬

ఫలమేమి ఈనరజన్మమో బహుకాలమంబున నేమదా
వెలకొన్న పక్షులమైనయా నిజవృక్షపుట్టుకలైనవా।
పొలుపొందుపుట్టుకపుట్టుకై పురుషార్థమేమియునగ్గెనో
ననుగన్నవా నను బ్రోవవే నారా॥ నారా॥

పనిబూని నాథయభక్తిచే భజనంబుచేసినవత్తువో
యనుపొందనీకును దాసుడై యతినిష్ఠనుండినవత్తువో।
మనుజేశ నాకారమియ్యవే మదినిన్ను సన్నుతిచేతును
ననుగన్నతండ్రివిర్ఘావయా నారా॥ నారా॥

ఇలనాలుబిడ్డలుసంపదల్ ఇదినీవుగల్గగచేసియుండ
నెలకొన్నభక్తినినిన్ను నే నిజమెంచగాదనునన్ను నా।
కలికాలరక్షణమెంచినన్ కరుణించకర్తవునీవుదా
ననుగన్నశ్రీహరిరోహరి నారా॥ నారా॥

యోగాత్రియైననువారుదా హృదయంబునిల్వనివారు నీ
తేజానుపుణ్యమురూపముల్ దర్శింపచేయనిదేవుని।
రాజాంగరాజసమెల్లనీ రామావతారములాయెగా
నాజాంబవంతునియల్లుడా నారా॥ నారా॥

అనుపొందనేనుతియింతునో యపుడొక్కరీతిగనుందునో
మనసందు ధ్యానముచేతునో మరియొక్కచింతలనుందునో।
పనిబూని నేనినుయిప్పుడే భజనంబుచేసెద నేనయా।
నన్నుబ్రోవవేహరిగోహరి నారా॥ నారా॥

కలికాలమందునుపాపముల్ కడుకోయనేరనినీవుదా
తిలకించినీనిజరూపముల్ దర్శింపచేయకయుంటివో।
ఇలనిన్ను వేడినజిహ్వదా ఇతరంబుగోరదునెప్పుడున్
లనుగన్నవా నను బ్రోవవే నారా॥ నారా॥

కలనైనకొండెము చెప్పినన్ కపటంబుపుట్టకమాను నే
ఇలనిన్ను వేడినమిక్కిలిన్ హితమైనదాసునిచేసి నా।
వలనుండుదుర్గుణమెల్లయున్ వనజాప్తవంతునిజేయవే
ననుగన్నశ్రీహరిరోహరి నారా॥ నారా॥

దానంబుముక్కిలివహోమములా తగయజ్ఞకర్మములాదిగా।
భువనంబురాజులు నేలినన్ పూజింప నేర్చినవారికిన్
ఇల నేలయి స్త్రీవి నేలవా హృదయంబులోనినునమ్మినా
నానందగోపురమాత్రమే నారా॥ నారా॥ ౩౪

మదిగోరిచేసినపాపముల్ మదివిన్నదోషముకన్నులం
గుదికొన్నదృష్టినిచేరునా కొదవెల్లతీరగతీరునా।
యెదురంగవచ్చియునిల్వవో ఇనవంశపావనమూర్తివా।
నదియిందుధారణసన్నుతా నారా॥ నారా॥ ౩౫

పగవాడుయాగ్రహాలేదునా పరికించికర్మములందునా
యెడనొందచేసినవ్యాధినా యతిఘోరతాపములైవదా।
ఖగవాహననుచేరనన్ కరుణింపనీవునునుండగా
నగధారణానన్బ్రోవరా నారా॥ నారా॥ ౩౬

సనకాదియోగులుమిమ్మునున్ నుతియింపజాలనివారిలో
పనిబూనినీనిజమంత్రముల్ పఠనంబుచేయగనేరనే।
వినవయ్యనీపదపద్యముల్ వినుపింపబూనితినింతయున్
ననుగన్నశ్రీహరిరోహరి నారా॥ నారా॥ ౩౭

కవులెల్లపమ్మతిగాగనే ఘనమూర్చలక్ష్మణయుక్తమై
వివరింపజాలనినిన్నుదా వినుతింపచేసినదేవరా।
భువినిన్నుసత్కృపులాదిగా బుధులెల్లమెచ్చగచేయరో
నవమోహనా భవభంజనా నారా॥ నారా॥ ౩౮

ఇభచర్మధారణనీవుదా ఇనమత్స్యసంభవునీవుదా
సుభవేదసారమునీవుదా సురకోటిముఖ్యుడునీవుదా।
అభయంబులీయనునీవుదా అఖిలాండకోటియునీవుదా
న్నభమండలాకృతమోన్నమో నారా॥ నారా॥ ౩౯

తలివంద్రడిబాసినబాలులం దయబ్రోవుకర్తవునీవుదా
యలబంధువర్గములేమికిన్ ననువొందనుండినీవుదా।
ఇలధీనరతుకనీవుదా హృదయంబునుంచిననేనయా
ననుగన్నవా నన్బ్రోపవే నారా॥ నారా॥ ౪౦

తగవందుధర్మములందు దా తగనీతిలోచినవాడవై
పగలందుదుగ్ధదకేళిలో బహులీలనుండినవాడవై।
జగమందుపాపపుబుద్ధినై జనియించియుండిన నేనయా
వగధారణానను బ్రోవవే నారా॥ నారా॥

ఇరవొందనాహృదయంబులో నిరతంబుకోరిక లేదునీ
చరణంబు లేమిదిమిక్కిలిన్ సౌభాగ్యసంపదలంచు నే।
నెరనమ్మినానిదిసత్యమే నిజ మెంచివేడిన నేనయా
నరసన్నుతానను బ్రోవవే నారా॥ నారా॥

శిలచేసిమ్రొక్కుటకేన నా జనచింత చంచలమేకగా
కందన్న ప్రేమను భక్తియో ఘనులైనసజ్జనులందుగా।
నెలకొన్న దేవుడ గాన నే నిజమెంచివేడిన నేనయా
నరసన్నుతానను బ్రోవవే నారా॥ నారా॥

వటబీజమెంతయు దారిచే వటపత్రబాహువుచెంతనే
నిటమీదనీకదొకంటనన్ నినుమంత చూచినజాలునే।
వటుగానినీవనివేడు నే నభయంబువేడిన నేనయా
నగసన్నుతానను బ్రోవవే నారా॥ నారా॥

పనిబూనివావయులేమిషన్ పైకొండివాడినయప్పుడున్
ఘుమ్మేఘధారగలగ్గినయిన్ కడుసంభ్రమించినరీతిగా।
నినువేడికోరితి నిప్పుడున్ నిజమాటచేసియుమిక్కిలిన్
ననుబ్రోవవే హరిరోహరి నారా॥ నారా॥

మునుపెంచుపుట్టినవాడనో ముదమందిభక్తులయిండ్లలో
యెందెందువ్యాపకలీలలై హితబుద్ధినుండినవాడవై।
యెందెందుకర్తవుగానినిన్ నభయంబువేడితినిప్పుడున్
నన్నందుమీకృపమాడుమీ నారా॥ నారా॥

రేపల్లెనందునియింటలో నీవున్న వేళలయందునీ
రూపెల్లదాల్చియుమిక్కిలిన్ రూఢింపయుగ్ధకలాలునై।
రేపల్లెగొల్లలయిండ్లలో మరివెన్నదొంగయునీవుదా
నాపట్టినీనిజమియ్యవా నారా॥ నారా॥

పనిబూనిరాధయుమిక్కిలిన్ పసిబండిలాటయెపక్కలో
నినుపర్యాళింపగచేసియున్ నెలకొన్న ప్రేమయునీవుదా।
చనులంటికూడితివేళదా సర్వజ్ఞమూర్తియునీవుదా
ననువంటిపచాధునియందుదా నారా॥ నారా॥ ౪౮

తలచిక్కవాసినమిక్కిలిన్ తలపోయుదుర్గంధంబులై
నెలకొన్నచీమిడినెత్తురున్ నిజధారకోతలపుట్టకల్।
ఇలకోమలాంగులయిండ్లలో కాపుండియుండిన నేవయా
ననుగన్నతానను బ్రోవవా నారా॥ నారా॥ ౪౯

పరవాసుదేవుడునీవుదా బహురూపధారివినీవుదా
నిరతంబునీభజనంబులై నిజభక్తవత్సలనీవుదా।
అరయంగ వేదమునీవుదా అఖిలాండకోటివినీవుదా
నరసన్నతానను బ్రోవవే నారా॥ నారా॥ ౫౦

పరచింతలాపినమిమ్ముదా భజనంబుచేసినవారలో
దమకించివచ్చివ బ్రోవవే దృఢచిత్తవైభవమియ్యవా।
కర మొప్పదేవరపాదముల్ కరుణింపనన్నుబ్రోవరా
నరసన్నతానను బ్రోవరా నారా॥ నారా॥ ౫౧

అనువొందగంభరవీధిలో యటవచ్చుగంధర్వుండుదా
వోనరంగనీవృషదోసిటన్ వుమియంగనీవునుమిక్కిలిన్।
పనిబూనిబ్రోచినదేవరం భయభక్తినిన్నును వేడగా
ననుపంటిదీనునిబ్రోవవే నారా॥ నారా॥ ౫౨

మదికోరిచేసినపాపముల్ మరివీడదందురు పెద్దలున్
కదనంబులోదొకపెద్దయా ఘనభీష్మమౌఘులజంపనీ।
ఘదియందుబాసినదేవరా ఇదియోటమీకునుచెల్లునా
నదియిందుధారణసన్నతా నారా॥ నారా॥ ౫౩

కటునంబుగూడినవ్యాధిచే ఇకనమ్మరానిదిదేనామో
పుడమందుపుట్టుకచేసియున్ పురుషార్థవైఖరియేమినా।
యొడనందుపాపము బాసినీ హితమైనదాసునిజేయుమీ
నడయూషువిగ్రహమౌనమో నారా॥ నారా॥ ౫౪

ధరణిన్నుశ్రీఖులు పేదల పెద్దలనవ్వు కొందుదయయునే
సరయుంగ పుణ్యస్థలములందు దా ననుపొందవారియు ప్రోవవే।
నిరతంబుగనీ పదపద్మముల్ సెరనమ్మి వేడిన సేవయా
నరకున్న తాహరిరీహరి నారా॥ నారా॥ ౬౨

నీకన్న దేవుడు లేడు నే సెరణమ్మి వేడితినిన్ను దా
చేకొన్న ప్రేమను క్షీమనో శ్రీహస్తరాంచనమియ్యవే।
రాకున్న నిన్ను నువిడుతునో రాధామనోహరనీకునా
కొన్న వాడ నేరావయా నారా॥ నారా॥ ౬౩

యునుపేద లేదనినీవుమా మలుచంబు లెంచినవాడనో
నిమగోరు పెద్దలు చిత్తముల్ నిజమంచు నేరనినిన్ను దా।
అనుమానసంగతులందు దా అభయంబులియ్యకనుందురా
నను ప్రోవవే హరిరీహరి నారా॥ నారా॥ ౬౪

చందంబులక్షణయుక్తమై సమకూటుపద్యములందునే
నందంబు తేర్పడ చెప్పనే న్వాగుండగాననిదేవరా।
నిందింపగాళక్షకంబులో నిజమూర్తిపంతములందుమీ
రాదుంబుమీరగ ప్రోవుమీ నారా॥ నారా॥ ౬౫

దాపున్న పెద్దల కెల్లనీ దయచేసిపల్కుయుమిక్కిలిన్
దూపెల్లపాపము దేహమే దూషించియుండిన నేవయా।
నిమో పుణ్యమార్గము లెల్లనా ఏకాదశీఫలమియ్యవే
నాపుణ్యమూర్తివి దాన్న మో నారా॥ నారా॥ ౬౬

కేపల్లెవాడవునీవుదా నిజమున్న దిన్నెలలోదనున్
దూపెల్లచూడగమిక్కిలిన్ దూషించి వేడితినిప్పుడున్।
నాపన్న రక్షక రావయా హరికృష్ణనీవుకు రావయా
నారా॥ నారా॥ ౬౭

చెల్లమద్దికాయలుసందెలుం చెలువొందపాపటమిక్కిలిన్
రధి తేజమిప్పుడు హేమునీ రాజిల్లు నీవుసుమెల్ల నో।
భువిదోషముండినరీతినిన్ పాలుపొందరిన్న నుమాడగా
నవనీతచోరుఢ రావయా నారా॥ నారా॥ ౬౮

ఇలజీవజీవులనీవుగదా దీనదానవశత్రువునీవుగదా
కలషన్నబోటనునీవుగదా కరుణాపయోనిధినీవుగదా।
నెలకొన్న భక్తినినిన్నుగదా శరణమ్ము వేడినదీవుగదా
ననుగన్న తాననుబ్రోవవే నారా॥ నారా॥

గిరులందువెలోదనునీవుగదా గ్రహములందువెలోదనునీవుగదా
నరయంగ కారణభూతముల్ నటుకొచ్చువెలోదనునీవుగదా।
నిరవొందనీభజనంబులకు ఇదొవచ్చి నాపనిరావయా
నరసన్నుతాహరిరోహరి నారా॥ నారా॥

వరదేవుడైనరజన్మమై వసుదేవపుత్రుడవైనమా
ఇరవొందనందునియింటిలో ఇలయుచ్చునంటీనరయొప్పగా।
పరికింపనీవునుభక్తులకు పాలించదేవుడవైనమా
నరసన్నుతాననుబ్రోవవే నారా॥ నారా॥

ఇలజన్మవతాటయోనేనుదా రెమిన్నిస్నికర్మముచేసినా
పలుమాయనీబుధులందునే బహుపాపకష్టముడైనవా।
నెలకొన్నప్రేమమునన్నుదా నిజభక్తకోటయుచేయకే
ననుగన్నశ్రీహరిరోహరి నారా॥ నారా॥

పరచాతలేకయుమిమ్ముదా భజనంబుచేసినవారిలో
తిరుకచ్చినంబినిబ్రోవరా వృషదిత్తవైభవమియ్యగా।
వరమెప్పదేవరపాదముల్ కడుభక్తివేడితినిప్పుడుగా
నరసన్నుతాననుబ్రోవవే నారా॥ నారా॥

కలికాలజన్మములందుదా కపటంబువిచ్చలమేకదా
వెలయింగనీశుభనామముల్ వినుతించువారలయందువా।
వెలకొన్నదేవుపటించుమిా నిజభక్తివేడితినిప్పుడుగా
ననుగన్నవాననుబ్రోవవే నారా॥ నారా॥

కనుసన్నచేసియుముక్కులిక కడుజాలపయ్యావముండునా
జనులందుచూపులనిల్పవా తరిచింతవిభ్రమపాటయుంగ।
పనిబూనికయ్యాకదిల్పివా పరభామలోలందనేనయా
ననుబ్రోవవేహరిరోహరి నారా॥ నారా॥

లోకంబు దేవుడు నీవుదా లోకంబులోకేలువారుదా
కోరన్న నేనుతియింతునే నిజమెంచ దేవుడు నీవుదా।
శ్రీమత్తులోలుండ నేవయా నగధారణా నను బ్రోవవే
నారా॥ నారా॥

ఇల తేళ మైవటపత్రమై యిభరాజరక్షక నీవుదా
ఇలమీద నేకయనంబునై యఖిలంబు నేలిన దేవరా।
వలనేర మేమని వేగమే వరమియ్య వేమయ నీవుదా
ఇలనిల్వ దేవ నమోనమో నారా॥ నారా॥

ఆత్రేయగోత్రము వృద్ధిగా ఆదూరియుం బెరుమాళ్లకుం
పుత్రుండు కృష్ణుడు మిక్కిలిన్ పొగడంగ దేవరపాదముల్।
నిత్యంబుగా వరమియ్యవా నిజభక్తి నీదయ చేయవే
వరసన్నుతా నను బ్రోవవే నారా॥ నారా॥

పలుమారు నీభజనంబులై పఠనంబు చేసినవారికిన్
కులగోత్రవర్ధియు మంచి సద్గుణ పుత్రవర్గములియ్యవే।
విలసిల్లుచుండుచు మిక్కిలిన్ విజయంబు చేకొనియుందువా
ననుగన్న శ్రీవారిరోహరి నారా॥ నారా॥

జంటనారాయణశతకము సంపూర్ణము.



శ్రీ శారదాముద్రాక్షరశాల, చిత్తూరు.